## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద

గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050016177

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: Inc

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

ఓమ్.

# నీతిలత.




సాహిత్యశిరోమణి & ఉభయభాషాప్రవీణ

కాండూరు నరసింహాచార్యులు.

కడపజిల్లా బోర్డు విద్యాశాఖాంధ్ర పండితులు వ్రాసినది.





ప్రొద్దుటూరు శ్రీజానకీ ముద్రాక్షరశాలయందు

ముద్రితము.

1932



కర్తృస్వామ్యము గ్రంథరచయిత్రధీనము)


(వెల 0-4-0

# OPINION

A book of stories is an un-ending source of inspiration to the youth of a Country. Great heroes of history of ardent hearus of stories and beautiful cradle songs of our Indian Homes reflect in no small measure their educative value to the impressionable minds.

The author deserves the gratitude of young readers for publishing a series of stories in a readable style.

Some of them are exciting and sustain the interest of young boys and girls for whom they are intended.

The moral conveyed by the stories appeals very easily to the children and the book is strongly recommended for introduction in Elementary schools.

[Sd] N. Simhadri
Senior Dy. Inspector of schools
Proddatur.



శ్రీ శారదాయైనమః.

# నీతిలత

—:* సత్యం వద. *:—

## కథ 1

పూర్వము సూర్యవంశపురాజులలో హరిశ్చంద్రుడను రాజుండెను. అతడు త్రిశంకు మహారాజు కుమారుడు. అతని భార్యపేరు చంద్రమతి. లోహితాస్యుడను నొక కుమారుడుండెను. అతడు సత్యమును తప్పకుండ రాజ్యమేలుచుండెను. అందువలన నతనిని జనులు సత్యహరిశ్చంద్రుడనుచుండిరి.

ఒకనాడు దేవేంద్రుడు సభగూడి యుండెను. అచ్చటికి ఋషులందఱు వచ్చి యుండిరి. అప్పు డింద్రుడు "భూలోకమునం దెవ్వరైన ఆడి తప్పని వారుగలరా?" అని ప్రశ్నించెను. అంతట వసిష్ఠుడు లేచి యిట్లనియె. "ఆర్యా! భూలోకమునందు సరయూనదీ తీరమున అయోధ్య యను పట్టణ మొకటి యున్నది. దానిని హరిశ్చంద్రుడను రాజు పాలించుచున్నాడు. అతడు మిక్కిలి సత్యవ్రతుడు, అతనిని మించిన వారెవ్వరును లేరు" వసిష్ఠునకును విశ్వామిత్రు

నకును ఎప్పటికిని వైరముమెండు. వసిష్ఠుని మాటలు విన(గానే విశ్వామిత్రుఁడు లేచి, "దేవేంద్రా! ఈ వసిష్ఠుఁడు సూర్యవంశపు రాజులకు పురోహితుఁడు. ఎప్పుడును వాండ్రను పొగడుచుండుట యాతనిపని, రాజులఁట. అబద్ధమాడరఁట. ఇది యెక్కడనైన నమ్మఁదగిన మాటయేనా?" అని పల్కెను.

వసి:—విశ్వామిత్రా! నీ ద్వేషబుద్ధిని మానుము. పక్షపాతమును మాట మాకడ నెప్పటికి నుండదు. కానుల కాశి వదు వారముగాను. ప్రతిష్టను గోమువారముగాను. ఊరక పొగడుట నిఁక మీఁద మావలన నేర్చుకొనవలయును. నిజము పల్కితిని.

వి:—అట్లా! హరిశ్చంద్రుఁ డంతటి వాఁడా?

వసి:—అంతటివాఁడని యొక్కసారి చెప్పెదవా? వేయి సారులు పల్కెదము. సూర్యుఁడు పడమటి దిశను ఉదయించినను అగ్నిచల్లఁదనముఁ బూనినను, సముద్రములింకి పోయినను ఈ ప్రపంచము తలక్రిందైనను హరిశ్చంద్రుఁడు సత్యవ్రతమును విడువఁడు. సత్యము. సత్యము. ఇది సత్యము.

వి:—వసిష్ఠా! గెలువలేవు. ఊరక యేల మాటఁబోఁగొట్టుకొనెదవు. చూడుము నాదెబ్బ. అనేక మాయలు పన్నియెట్లయినను ఆ హరిశ్చంద్రుని బొంకింతును.

వ:—అది నీచేతఁగాదు. ఏల శ్రమపడెదవు.

వి:—ఏమంటివి. నాచేతఁ గాదంటివా. నే నతనిని బొంకింపలేనను కొంటివా. చూడుము. నేనేమి చేసెదనో.

వి:— బొంకింప లేకుంటి వేని.

వి:— బొంకింప లేకుంటినా, నాతపమునం దర్ధభాగ మతని కిచ్చి సామ్రాజ్య పట్టాభిషిక్తునిఁ గావింతును. పదునాల్గు మన్వంతరముల వఱకు ఇంద్రుని యర్ధాసనమున నిలుపుదును.

వసి:— అట్లయిన కానిమ్ము. చూతము.

అంతట విశ్వామిత్రుఁ డసూయతో బయలు దేరి పోయెను. ఇంద్రుఁడు సభ చాలించెను.

ఒకనాఁడు విశ్వామిత్రుఁడు హరిశ్చంద్ర మహారాజు నొద్దకుఁబోయి "నే నొక యాగము చేయుచున్నాను. దానికి ఒక మనుష్యుఁడేనుఁగు నెక్కి రత్నమును విసరివేసిన నెంత పొడవు పోవునో అంతెత్తు ధనము కావలెను. ఇమ్ము" ని యాచించెను. అతఁడు బొక్కసము కడకుఁ గొనిపోయి కావలసినంత తీసికొమ్మని పొండని అప్పగించెదు. "ఇప్పుడు గాదు యాగము ప్రారంభించి నప్పుడు వచ్చి కొనిపోయెద" నని చెప్పి పోయెను.

తర్వాత హరిశ్చంద్రుని అడవులకు రప్పించి చిక్కులు పెట్టవలెనని తలఁచెను. అరణ్యమునిండ దుష్టమృగములను సృజించెను. అడవిజనులు వాని బాధలకుఁ దాళఁజాలక రాజున కెఱింగించిరి. అంతట హరిశ్చంద్రుఁడు వేఁటకు వచ్చి మృగములను వేఁటాడి యలసి యొక చెట్టుక్రింద అలసట తీర్చుకొనుచుండెను. అప్పుడు విశ్వామిత్రుఁడు ఇనుపుగు మాల

పడుచులను రాజు కడకుఁ బంపెను. వారుపోయి రాజును వివాహ మాడుమనిరి. అతఁడు "నే నేక పత్నీవ్రతుఁడను. పరస్త్రీల నంట న" నెను. అది వినక చండాల కన్యకలు రాజును బలాత్కరించు చుండిరి. సేవకునిఁ బిలిపించి వెడలఁ గొట్టించెను. వారుపోయి జరిగిన వృత్తాంతమును విశ్వామిత్రునకుఁ దెల్పిరి. అతఁడు మండిపడుచు రాజుకడకు వచ్చెను.

విశ్వా:—ఏమిరా రాజా! క్రొవ్వుపట్టితివా. నా కెఱుక లేకుండా నా యాశ్రమమున నేల ప్రవేశించితివి? నా పుత్రికలు నీకుఁ జేసిన కీడేమి? వారల నేల దండించితివి?

హరి:—మహాత్మా! నే నేమంటిని?

విశ్వా:—ఏమంటివా కొట్టి పంపితివి.

హరి:—తపోధనా నే నొప్పని కార్యమునకు బలాత్కరించిన నేనేమి చేయవలయును.

విశ్వా:—నీ వొప్పవా? కానిమ్ము. నిరపరాధినులను దండించిన నేరము నీపై నున్నది. అందుకు నా కన్నియల పెండ్లియాడుము.

హరి:—మునిపుంగవా! నా రాజ్యమునైన నప్పగించెదను గాని నా వ్రతమును విడువను. నేనేక పత్నీవ్రతుండను.

విశ్వా:—ఆహా! అట్లా అంత సత్యము తప్పనివాఁడవా, ఏదీ రాజ్యమునైన నిచ్చెదగా? యంటివి. ఇమ్ము.

అంతట హరిశ్చంద్రుఁడు ఉదకధారా పూర్వకముగా రాజ్యమును ధారవోసెను.

విశ్వా:—హరిశ్చంద్రా! నీ రాజ్యము నంతయు నా కర్పించితివి. పూర్వము నాకిచ్చెదనన్న ద్రవ్యమిప్పుడు కావలయును. ఏది తెచ్చి యిమ్ము.

హరి:—స్వామీ! కొలఁది కాలములోఁగా మీ బాకీ చెల్లించెదను. ఆజ్ఞ యిండు.

విశ్వా:—కానిమ్ము. నాకు నక్షత్రకుఁడు శిష్యుఁడు. వానిని వెంటఁబెట్టుకొని పోయి ద్రవ్యమునిచ్చి పంపుము. అతఁడు మొగకనివాఁడు. శ్రమలకోర్వలేఁడు. శ్రమపెట్టకుండ త్వరలో నిచ్చి పంపుము. అని చెప్పి తానయోధ్యకుఁ బోయెను. హరిశ్చంద్రుఁడు భార్యను కుమారుని వెంబడించుకొని నక్షత్రకునికి శుశ్రూషలు చేయుచు కాశికి బయలుదేరెను నక్షత్రకుఁడు మార్గములో మాటిమాటికి హరిశ్చంద్రుని నొప్పించుచుండెను. కాశిని జేరిరి. నక్షత్రకుని తొందర బలమయ్యెను. వాని బాధలను సహింపలేక హరిశ్చంద్రుఁడు తన భార్యనమ్మి బాకీ తీర్పదలంచెను.

కాశీనగరము వీధిలో నిలుచుకొని "ఓ మహానుభావులారా! నేను ముందు విశ్వామిత్ర మహామునికి యాగార్థము ధనమిచ్చెదన" ని యొడఁబడి యుంటిని. ఆ ఋణమును తీర్చుటకు వేఱుపాయము లేదు. అందువలన నా భార్యనమ్మి బాకీ తీర్పఁదలంచినాను. ఈ నగరమునం దెవ్వరైన కొనువారు గలరా!" అని అఱచుచుండెను. కాలకౌశికుఁడను బ్రాహ్మణుఁడు చంద్రమతి కొడుకుతోఁగూడఁ గొనెను. యింటికిఁ

గొనిపోయి తన భార్యకు కలహాకంఠి కప్పగించెను. ఆమె చంద్రమతిని పెక్కు బాధలు పెట్టుచుండెను.

హరిశ్చంద్రుడు మునిఋణమును తీర్చివేసెనుగాని నక్షత్రకుడు తాను నెలనుండి యతనితోఁ గూడ శ్రమపడి నందులకు బహుమతి నిమ్మని పీడించు చుండెను. అందులకై హరిశ్చంద్రుఁడు తన్నొక చండాలున కమ్ముకొనెను. అతని పేరు వీరబాహుఁడు. అతఁడు శ్మశాన ఘట్టమునందు కావలి యుండువాఁడు.

ఒకనాఁడు కలహాకంఠి లోహితాస్యుని చావఁదన్ని అడవికిఁబోయి ఆకులు దెమ్మనెను. అతఁడడవికిఁబోయి యాఁకులు గోయుచుండఁగా పాము గఱచి చచ్చెను. చంద్రమతి మిగుల దుఃఖించి బాలునెత్తుకొని కాటికిఁ బోయెను. ఆమె యేడుపు చప్పుడువిని వీరదాసుఁడువచ్చి కాటి సుంక మిమ్మనెను. పాపమామె యెక్కడినుండి తేఁగలదు. ''అయ్యా నేను దరిద్రురాలను, సుంకమీయ లేను. నీకు పుణ్యము వచ్చును. సాయముచేయుమ'' నెను. అందులకు కాటికావరి మన్నన్నుకఱుగ లేదు. 'మంగళసూత్రమిచ్చి నీకుమారుని కాల్పుమ'నెను.

అంతట చంద్రమతి 'తన మంగళసూత్రము మగనికి తప్ప నితరులకు కనఁబడదుగావున నాతఁడు హరిశ్చంద్రుఁడ'ని నిశ్చయించుకొనెను. కుమారుని శవమును హరిశ్చంద్రున కుఁజూపి యేడ్చెను. "పతీమణీ! చచ్చినవారిని కాల్చితీరవలెఁ

గదా. కాటినుంక మీాయనిది యాపని యెట్లు జరుగును. మీాయజమానురాలి నడిగికొని రమ్ము. పొమ్మ"ని చంద్రమ తిని బంపి తాను కుమారునిఁజూచి దుఃఖించుచుండెను.

చంద్రమతి గ్రామములోనికిఁ బోవుచుండెను. దొంగలు కాశీరాజుకొడుకును జంపి సొమ్ములు గొనిపోవుచుండిరి. రాజభటులు వెంటఁబడిరి. వారు భయపడి సొమ్ములు చంద్రమతి మెడలో వేసి పాఱిపోయిరి. రాజభటులువచ్చి చంద్రమతియే యీపని యొనర్చెనని రాజునకుఁ దెల్పిరి. కాశీరాజు చంద్రమతిని సంహరింపవలెనని యుత్తరువిచ్చెను. రాజభటులు గొనిపోయి వీరదాసున కప్పగించి రాజాజ్ఞ దెలిపిరి. అతఁడు రాజాజ్ఞ మీాఱలేక చంద్రమతి శిరము ఖండింపఁ బ్రయత్నించుచుండెను.

ఇంతలో విశ్వామిత్రుఁడు వచ్చుగెత్తుకొనివచ్చి అడ్డగించెను. లోహితాస్యునిని, కాశీరాజు పుత్రునిని బ్రదికించెను. అయోధ్యారాజ్యమును హరిశ్చంద్రున కిచ్చివేసెను. మనస్సును బరీక్షించుటకై తన్ను బాధపెట్టినందుకు క్షమింపవలయునని వేఁడుకొనెను. హరిశ్చంద్రుని సత్యవ్రతమునకు మెచ్చి దేవతలు పూవులవానఁ గురిపించిరి. కావున సత్యమును విడువరాదు.

ఉ॥ సత్యమెసంగు శ్రేయమును సత్యమెసంపదయిజ్జగంబునన్
సత్యమెసంగు గౌరవము సత్యమెదైవము సర్వదిక్కులన్
సత్యము సర్వసౌఖ్యదము సత్యమలంకృతి మానవాళికిన్
సత్యము వీడఁగావలదు సజ్జనులార! నిజంబు బల్కుడన్

# క థ 2



భగవంతుఁడు మనకెట్టి స్థితినిఁ గలిగించునో దానిని బొంది సంతోషపడవలెను. దానిని నిందించి మఱియొక దానిని గోరరాదు. అట్లు కోరితిమా మనకు దొరికినదాని ననుభవించి తీరవలెను. అది మనకు సరిపడక పోయినయెడల దైవమును నిందింపఁగూడదు. ఒక సేవకుఁ డొకరాజునొల్లక మఱియొక రాజు నాశ్రయించును. అతఁడు వానిని పీడించును. అప్పుడు మొదటిరాజును విట్టి ఫలమేమి. వచ్చినదానినోర్చుకొనవలెను.

ఒక మడుగునందుఁ గొన్ని కప్పలుండెను. అవియన్నియు నొకనాఁడు సభచేసి యిట్లాలోచించెను. మనము మన యిష్టమువచ్చినట్లు చేయుచున్నాము. ఇష్టమువచ్చినట్లు తిరుగుచున్నాము. ఇది కేవలము పనికిమాలిన పని. మనకొక రాజుండుట మంచిదిగాని యిట్లుండుట యెంతమాత్రము తగదు. కావున మనమొక రాజు నేర్పఱుచుకొని యతని మాటచొప్పున నడుచుకొందము. అని యోచించుకొని యన్నియుఁ గూడి విష్ణువును స్వామీ! మాకొక రాజునిమ్మని ప్రార్థించెను. విష్ణువు వానిమాటలంగీకరించి ఇదిగో తీసికొనుఁడని యొక చెక్కమొద్దును ఆకాశమునుండి మడుగులోఁబడవైచెను.

ఆమొద్దు పడఁగానే దాని దెబ్బచేత నీరంత కదిలి గొప్పశబ్దము పుట్టెను అవి యన్నియు భయపడి దానిదగ్గరకు పో

కుండెను. కొన్నిక్షణములకా శబ్దమడఁగి పోయెను. అప్పుడు కప్పలన్నియు భయముమాని మొద్దుకడకుఁ బోయెను. దాని పై నెక్కెను. దానితో నాడుకొనెను. ఎంతకాలమైనను ఆ మొద్దు కదలమెదలకుండెను. దానిని జూచి కప్పలు ఈరాజుకు జీవములేదు. ఇతఁడు మనకు పనికిరాఁడు. ఇతనికంటె మంచి రాజు నింకొకనిని యాచించవలెను. అని యోచించుకొని విష్ణువును ప్రార్థించెను. అంతట విష్ణువొక క్రౌంచపక్షిని బంపించెను. అది వచ్చినప్పటినుండి మండూకములను దినుటకు మొదలుపెట్టెను.

కప్పలన్ని క్రమముగా నశించుచుండెను. మండూకములు తమ నాశమును సహింపఁజాలక మరల విష్ణువును గుఱించి స్వామీ! ఈరాజును మేమొల్లము. మఱియొక రాజును పంపించితివా సంతోషము. లేదా మాకు మునుపటిరాజే చాలును. అని ప్రార్థించెను. అప్పుడు విష్ణువిట్లు పలికెను. నేనిప్పుడింకేమి చేయను. మొదట నేను పంపినరాజు మీకు సరిపడకపోయె. ఇప్పుడు చింతించి ఫలమేమి? మీయపరాధమునకుఁ దగిన ఫలమును మీరనుభవింప వలయును గదా. అనఁగానే భేకకములూరకుండె. కాఁబట్టి భగవంతుఁ డిచ్చినంతటితో తృప్తి పడవలయును గాని యెక్కువ కోరరాదు.

ఉ॥ మున్నన చేసి యీశ్వరుఁడు మానుగ నిచ్చిన వృత్తితో సుఖం
బున్న మనుష్యులందొరయ నొక్కఁడు లేఁడు ధరిత్రి యట్లుగా
కున్నత మాపదంబుఁ గన నూహలఁ బోయినఁ గీడు చేకుఱున్
గ్రన్నన భేకముల్ తొలిని గాంచవె దుర్గతి మీరెఱుంగరే.

# కథ 3

పూర్వకాలము నందొక బ్రాహ్మణుఁడుండెను. అతని పేరు ద్రోణుఁడు. అతఁడన్ని విద్య లెఱుంగును, ధనుర్విద్య యందు మిక్కిలి గట్టివాఁడు, ఆతఁడు పాండవులకును కౌరవులకును గురువుగానుండి విద్యల నేర్పుచుండెను. అతని కడ కొకనాఁడొక బోయవాఁడు వచ్చెను, ఏకలవ్యుఁడని వాని పేరు. "స్వామీ! నన్ను మీ శిష్యులలోఁ జేర్చుకొని ధనుర్విద్య నుపదేశింప వలయున"ని ప్రార్థించెను. అందుకు ద్రోణాచార్యుఁడు 'ఓరీ! నీవు శూద్రుఁడవు కావున నీకు నేనుపదేశింప న'ని తిరస్కరించెను.

ఏకలవ్యుఁ డడవికిఁబోయి ద్రోణాచార్యులవలె నొక మట్టిబొమ్మను జేసెను. దాని నొకచోట నిలిపెను. ప్రతిదినము ఆ విగ్రహమునకు మిక్కిలి భక్తితో పూజ చేయుచుండెను. ఆ విగ్రహముముందు నిలుచుకొని బాణవిద్యను అభ్యసించుచుండెను. దిన దినమున నతఁడు ధనుర్విద్యలో గట్టివాఁడగుచు వచ్చెను. కొంతకాలమున నతఁడు బాణవిద్యలో సాటిలేని వాఁడాయెను.

ఒక్క నాఁడు పాండవులు కౌరవులు గలసి వేఁట కుక్కల వెంటఁ బెట్టుకొని యాయరణ్యమునకు వేఁటకుఁ బోయిరి. వారిలోనుండి యొక వేఁటకుక్క యేకలవ్యుని యాశ్రమము కడకుఁ బోయెను, అందలి మృగములను తరుముచు గోలచే

యు చుండెను. అప్పుడేకలవ్యుఁడు చిత్రవిచిత్రముగ దాని మొడలునిండ బాణములు నాటెను. అది చూచువారలకు మిక్కిలి యాశ్చర్యమును గలిగించు చుండెను. అర్జునుఁడు దానిని జూచి కొంతముసేపు దిగ్భ్రమఁజెంది తర్వాత తన మనస్సులో నిట్లు చింతించెను. "ఏమి యీ యాశ్చర్యము. బాణవిద్యలో నాకంటె గట్టివాఁడెవ్వఁడు లేఁడనుకొను చుంటిని. నా గురువులుగూడ అందఱికంటె నన్నే గొప్పఁగఁ జేయుదునని పలికియుండిరి" ఇంత విచిత్రముగ బాణ ప్రయోగము చేసిన యీ వీరుఁడెవఁడుండ వచ్చును? ఇతని గురువెవఁడుండ వచ్చును. ద్రోణాచార్యులు తప్ప ఇంతటివారు మఱెవ్వరును లేరుగదా! కానిమ్ము. ఈ యడవిలో వెదకి చూచెదను" అని చింతించి యందందు వెదకుచు నా కుక్కవచ్చిన దారినిఁ బట్టి పోయెను.

అడవిలో నొక్కచోట ఒక గుడిసెకనఁ బడెను. దానిలో నొక మట్టిబొమ్మ ఒక పురుషుఁడు తప్ప మఱెవ్వరు లేకుండిరి. అతఁడు గొప్ప వీరుఁడుగాఁ గన్పట్టెను. వెంటనే యర్జునుఁడు దగ్గరికిఁబోయి యార్యా మీరెవ్వరనెను. స్వామీ! నేను నిషాదుఁడను, నా పేరేకలవ్యుఁడందురు. అనెను. కాని యీకుక్క శరీరమున బాణములు నాటినవారిందెవ్వరు? అని ప్రశ్నించెను. నేనే యని యతఁడు బదులు చెప్పెను. నీకు బాణవిద్య నేర్పిన వారెవరు? అని మరల ప్రశ్నించెను, ద్రోణాచార్యులని యతఁడు బదులిచ్చెను. అంతట అర్జునుఁడు

దిక్కుతోఁచక దిగాలుపడి కొంచెము సేపుండి యేమియుననక తన గురువుకడకు వెళ్లెను.

ద్రోణునిఁజూచి ఆచార్యా! మంచి చిక్కుదెచ్చి పెట్టితిరి. ఆచార్యులిట్లు చేయనగునా.

ద్రో:—అర్జునా! ఏమిది ఇట్లు బల్కుచున్నావే ఏమిజరిగెను.

అర్జు:—ఏమున్నది. కొంపమునిఁగినది. ఆచార్యా! లోకమున నందఱికన్న నన్ను బాణవిద్యలో గట్టివానిని చేయుదునని మీరు చెప్పలేదా?

ద్రో:—అవును. నిజమే. అందుకొఱకిప్పుడేమి?

అర్జు:—ఇప్పుడేమియా, అదిగో ఆయరణ్యమున నొక బోయవాఁడున్నాడు. అతఁడు నన్నుఁగాదు. నాయంటి వారిని నూఱుగురిని మించి యున్నాఁడు. ఇది నేను కన్నులారఁ జూచివచ్చితి. అతఁడు మీ శిష్యుఁడఁట.

ద్రో:—అటా, అతఁడెవ్వఁడో చూతమురమ్ము.

అని యందఱు గలసి యేకలవ్యుని గుడిసెదగ్గరకుఁ బోయిరి. ఏకలవ్యుఁడు ద్రోణాచార్యులకు నమస్కరించి నిలుచుండెను.

ద్రో:—ఓరీ! నీవెవ్వరి శిష్యుఁడవు?

ఏక:—స్వామీ! నేను మీ శిష్యుఁడను?

ద్రో:—నీవెట్లీ విద్యలను నేర్చితివి.

ఏక:—మీ యనుగ్రహము చేత ఇదిగో చూడుఁడు. మీ విగ్రహమును. ఇందుమూలమున నేను నేర్చితిని.

ద్రో:—అట్లయిన నీవు గురుదక్షిణ నేమిచ్చెదవు?

ఏక:—ఆచార్యుల కేది యిష్టమో అది.

ద్రో:—అట్లయిన నీబొటనవ్రేలిని గోసియిమ్ము.

స్వామీ! చిత్తము. అని తనకుడిచేతి బొటనవ్రేలినిగోసి యిచ్చెను. అర్జునుఁడు సంతోషముతో నింటికిఁ బోయెను.

కావున గురుభక్తిగల వారికిఁ గొదువ యేమున్నది. వారెంతటి కఠిన విద్యనైన సంపాదించ గలరు గదా.

చ॥ గురువును నమ్మి కొల్చిన గొంకక భక్తిమెయిం భజించు స
త్పురుషుఁడు విద్యయున్ యశము భోగసంపదఁ గాంచు కీర్తి
ధరవిలువిద్యకై మును దామది ద్రోణుభజించి కాంచఁడే
ఘనమ యశోవిలాసమును భాసురి సద్గుణుఁడేకలవ్యుఁడున్.

# కథ 4

ఒక యడవిలో నొక సింహము వాసము చేయుచుండెను. అది మృగముల కన్నింటికిని రాజు. కావున తనకుఁ జిక్కిన మృగములన్నిటిని జంపి తినుచుండెను అరణ్యములోని మృగములన్నియు దిన దినమునకు తగ్గుచుండెను.

ఒక్కనాఁడు మృగములన్నియుఁ జేరి యొక సభ జరిపెను. అందులో నొక మృగము లేచి యిట్లు చెప్పెను. మనకు సింహము రాజయిన విషయము నిజమే. అది మనజాతి మృగముల నెల్లను చిక్కినట్లెల్ల చంపి తినుచున్నది. మన జాతి దినదినమునకు నశించుచున్నది. ఇదిమీారందరెఱుంగుదురు.

ఇప్పుడు నేనొక యుపాయము చెప్పెదను. అది మీకందఱికి ఇష్టముగా నుండెనా సమ్మతింపుడు, ఇప్పుడు మన మందఱము చేరి సింహము దగ్గరకుఁ బోవుదము. అయ్యా! మృగరాజా! మీరు మీయిచ్చవచ్చినట్లు మృగములను చంపుచుండుటవలన మా జాతి యంతయుఁ నశించు చున్నది. ఇందువలన మాకంటె మీకే యెక్కువ నష్టము కనఁబడు చున్నది. కొంతకాలమునకు మీకే యాహారము లేక పోవచ్చును. మీకు దినమునకు ఆహారమునకుఁ గావలసిన దొక్క మృగమేగదా. మేము వంతుల ప్రకారము దిన మొక్క మృగముగా తెల్లవారి యెనిమిది గంటలకు నీ కడకు వచ్చు చుందుము. ఇందు కొప్పుకొందువా నీ కెప్పటికి లోపము శ్రమము లేకుండ జరుగును. ఊఱక యేల మృగముల నన్నిటి నొక్కసారి చంపివైచెదవని ప్రార్థింతము. అందుకు సింహ మొప్పుకొనును. మనజాతియు బాగుపడు ననెను. అందుల కన్నియు చేతులెత్తి యేకగ్రీవముగా నంగీకరించెను.

మఱునాఁ డుదయమున మృగములన్నియుఁ జేరి సింహము దగరకుఁ బోయెను. నమస్కరించెను. సింహ మేలవచ్చితిరని యడిగెను. మృగములు మొదటిదినము తాము చేసికొనిన తీర్మానమును వినిపించెను. మృగరాజు సంతసించి యొప్పుకొనెను. మృగములు తమతమ తావులకు జనియె.

తర్వాత క్రమముగా వంతుల ప్రకారము మాటతప్పకుండ ఒక్కొక్క మృగము చొప్పున సింహము దగ్గరకుఁ బో

వుచుండెను. ఒక్కనాఁడు కుందేటికి వంతువచ్చెను. అది తన మనస్సులో నిట్లుచింతించెను. అయ్యో! నేఁడెంత పాపిదినము. పూర్వజన్మమున నేనెవ్వరి గొంతులు కోసియుంటినో గదా. యేమి నాదుర్దశ. వ్యాఘ్రముగ సింహము నోటఁబడి చావవలసివచ్చెను తప్పించుకొన నుపాయమేమున్నది. కాని యేయుపాయముచేతనైన నీసింహమును జంపించి తప్పించుకొనవలయును. అప్పుడుగాని మాజాతి బాగుపడదు. అనుకొని మెల్లఁగా అడుగులో అడుగు వేసికొనుచు మధ్యాహ్నమునకు సింహమును సమీపించెను. సింహము ఆఁకలిచేత నుంటలేచి యెగిరిపడుచుండెను. అదిగని విసయముతో దగ్గరకుఁబోయెను. ఏమిరా! ఓరీ! మాకు మరల బాగకెక్కనట్లున్నదే ఆహా! ఇందుకొఱకే గాఁబోలు "కుట్టితే తేలందురు. కుట్టకున్న కుమ్మర పురువందు" రను సామెత పుట్టియున్నది. మరల నాప్రతాపమును జూపవలయునా, ఏల యింతాలస్యము చేసితివి అనెను. అందుకు స్వామీ! నాదేమియు తప్పులేదు నేను వేళకే వచ్చుచుంటిని. దారిలో మీవంటి సింహమింకొకటి యడ్డమువచ్చి నన్నుఁ జంపఁజూచెను. మీపేరు చెప్పి మీతో మాటలాడి మరల వచ్చెదనని సమాధానపఱచి యందుంచి వచ్చినాను. ఉన్నసంగతి యిది. మీదాసులమగు మామీఁద యేల కోపపడెదరు. అని కుందేలు బదులుచెప్పెను.

ఆమాట విన్నంతనే సింహము కడుపులో ఆవాలునూరుకొని దాగినట్లయ్యెను. ఏది ముందునడువుము. ఆదుష్టు

గొందున్నాఁడో చూపుము. ముందాతని చంపిగాని నాయాఁకలిఁ దీర్చుకొనను. అని సింహము బలికెను. కుందేలు ముందుబోయి యొక పెద్దబావి చూపి అదిగో నీశత్రువా బావిలోనున్నాఁడనెను. సింహము తొంగిచూచెను. బావిలోని తననీడనుజూచి వేఱొక సింహమున్నదని తలఁచి యందులో దుమికెను. కొంచెముసేపటికి అందులోనే మరణించెను. అప్పటినుండి మృగములన్ని సుఖముగా నుండెను.

బుద్ధిబలమే బలముగాని దేహబలము బలముగాదు.

"ఉ॥ వారక బుద్ధిమంతుఁడగు వాఁడె బలాధికుఁడైనవాఁడు గా
కారయ బుద్ధిహీనునకునైన బలంబది నిష్ఫలంబు గు
ర్వార మదంబునంబరఁగి వాలిన సింహముఁ జంపె నేర్పుతో
నీరసమిక్కుటైన శశమెట్టిదొ బుద్ధిబలంబు చూడుమా."

---

## కథ 5

లోకమునందు దుర్జనులు కొందఱుందురు. వారి కుపకారము చేసినను అపకారమే చేయుదురు. ఉపకారికపకారము చేయుట దుష్టుల స్వభావమేగదా. అట్టివారినిఁ జూచి దూరమున విడిచితిమా గొప్పలాభము పొందినవార మగుదుము.

ఒక యడవిలో నొక తోడేలుండెను. అది యొకనాఁడు మేఁకను జంపి తినుచుండెను. అప్పుడొక యెముక దాని గొంతులో గ్రుచ్చుకొనెను. దానిపోటుకు తాళలేక పెద్దఁగా అఱుచుచు వనమంతట తిరుగుచుండెను. దారిని యేమృగము